తా. శుభేచ్ఛాది భూమికాచతుష్టయాభ్యాసమువలనసర్వ విషయములయందును బొత్తిగా సంసర్గము లేకయుండి పర మాత్మయందు గాఢమైన స్థితి యసంసక్తి యనఁబడును.

శ్లో. భూమికాపంచకాభ్యాసాత్స్వాత్మారామతయా భృశం,
ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్.
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్,
పదార్థాభావినీ నామ షష్ఠీ భవతి భూమికా.

తా. శుభేచ్ఛాదిభూమికాపంచకమును నభ్యసించు కేవల స్వరూపమునందే దృఢముగా చేరి యానందించుచున్న చిత్త మునను బాహ్యవిషయములు గాని అంతరవిషయములు గాని గోచరించక యుండుటచేత పరులయొక్క ప్రయత్నముచేతనే చిరకాలమునకు వ్యుత్థానమును బొందు పురుషునియొక్క దశ పదార్థాభావిని యను ఆఱవభూమికగా చెప్పఁబడును.

శ్లో. భూమిషట్కచిరాభ్యాసాద్భేదస్యానుపలంభనాత్,
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః. అని.

తా. వెనుక ఆఱుభూమికల నభ్యాసముచేసినందున భేదప్రపంచ మెప్పటికిని స్ఫురించకపోవుటవలన సర్వకాలసర్వా వస్థలయందు పరబ్రహ్మస్వరూపమునందు నిష్ఠ కలిగి యుండి పరప్రయత్నమువలనైనా వ్యుత్థానమును పొందకయుండుట తురీయ యనెడి యేడవ భూమికగా చెప్పఁబడును.

ఈ యేడు భూమికలలో మొదట మూడుభూమికలు బ్రహ్మవిద్యకు సాధనములుగా నుండును. కాని విద్యయం దంత ర్భూతములు కానేరవు. ఈ మొదటి మూడుభూమికలయందు

భేదప్రపంచము సత్యముగానే తోఁచుచుండును గనుకనే యిది జాగ్రదవస్థయని చెప్పఁబడును. జాగ్రదవస్థయందు భేదప్రపంచము సత్యముగా స్ఫురించును గదా.

ఈయర్థము వసిష్ఠమహాముని చే చెప్పఁబడినది.

శ్లో. భూమికాత్రితయం త్వేత ద్రామ జాగ్ర దితి స్థితం,
యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే. అని.

తా. ఓ రామచంద్రా, జాగ్రదవస్థయందు భేదబుద్ధివలన యథార్థముగా నీప్రపంచము చూడఁబడును. ఈభూమికాత్రయమునందును ప్రపంచము భేదబుద్ధివలన యథార్థముగానే తెలియఁబడుచుండును గనుక నీభూమికలు మూఁడును జాగ్రదవస్థ యని చెప్పఁబడును.

ఈమూఁడు భూమికలను దృఢముగా నభ్యసించినవెనుక వాత వేదాంత మహావాక్యములవలన నిర్విశేష ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపసాక్షాత్కారము కలుగును. ఇదియె సత్త్వాపత్తి యను నాలుగవభూమిక. ఇదియె భూమికాత్రయాభ్యాసముయొక్క ఫలము. ఇదియె బ్రహ్మవిద్య యని పండితులచే చెప్పఁబడినది. ఈనాలుగవ భూమిక యందు సర్వప్రపంచమున కుపాదాన కారణమైన పరమాత్మయొక్క స్వరూపమును అద్వితీయసచ్చిదానందస్వరూపమని నిశ్చయించి పరమాత్మయం దారోపింపఁబడిన జగత్తని ప్రపంచమని చెప్పఁబడు నామరూపములు మిథ్య యని తెలుసుకోఁబడును. మోక్షేచ్ఛగల పురుషునికి వెనుకఁ జెప్పిన జాగ్రద్దశనుబట్టి చూడఁగా నీభూమిక స్వప్న మని చెప్పఁదగియున్నది.

ఇదియును వసిష్ఠమహామునిచే చెప్పఁబడినది.

శ్లో. అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే చ ప్రశమం గతే,
పశ్యంతి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః.

తా. చిత్తమునందద్వితీయపరబ్రహ్మస్వరూపము స్థైర్యమును పొందఁగానే ద్వైతప్రపంచ మంతయుఁ బ్రకాశించక శాంతిని పొందియుండును. ఇట్టి నాలుగవభూమికను పొందిన మహానుభావులు ఈప్రపంచమును స్వప్నప్రపంచమును జూచినట్లు మిథ్యగాఁ జూచుచుందురు.

శ్లో. విచ్ఛిన్నశరదభ్రాంశవిలయం ప్రవిలీయతే,
సత్తావశేష ఏవాస్తే చతుర్థీం భూమికాం గతః.

తా. శరత్కాలమేఘమునుండి చెదరిన మేఘశకలము లేప్రకారము క్షీణించి కనుపడకపోవునో యాప్రకారమే యీభేదప్రపంచము క్రమముగా క్షీణించును. నాలుగవభూమికను పొందిన మహానుభావుఁడు కేవలసత్తారూపమయిన బ్రహ్మముగానే నిలిచియుండును.

ఈనాలుగవ భూమికను పొందిన పురుషుఁడు బ్రహ్మవిత్తని చెప్పఁబడును. పంచమ షష్ఠ సప్తమభూమికలు మూఁడు జీవన్ముక్తియొక్క అవాంతరభేదములు. అవి నిర్వికల్పసమాధ్యభ్యాసముచేతనైన చిత్తవిశ్రాంతియొక్క తారతమ్యము నవలంబించి కలుగుచుండును. పంచమభూమికయందు నిర్వికల్పసమాధిలో కొంతకాలము నిలిచినతరువాత స్వయముగానే వ్యుత్థానమును బొందును.

ఈపంచమభూమికయం దుండుయోగి బ్రహ్మవిద్వరుఁడని చెప్పఁబడును. ఆఱవభూమికలోనికి పోయినయోగి నిర్వికల్ప సమాధిని చేయుచుండి పరప్రయత్నముచేత వ్యుత్థానమును బొందుచుండునుగాని స్వయముగా నెంతకాలమున కైనా వ్యుత్థానమును బొంద నేరఁడు. ఈ రెంటిలో అయిదవభూమిక సుషుప్తియని, ఆరవభూమిక గాఢసుషుప్తియని చెప్పఁబడును.

ఈయర్థమును వసిష్ఠమహర్షి చే చెప్పఁబడినది.

శ్లో. పంచమీం భూమికామేత్య సుషుప్తపదనామికాం,
శాంతాశేషవిశేషాంశ స్తిష్ఠత్యద్వైతమాత్రకే.

తా. సుషుప్తి యని చెప్పఁదగిన అయిదవభూమికను పొంది శమించిన సకలవిశేషములు గలవాఁడై అద్వితీయుఁడ మాత్రస్వరూపమునందే నిలిచియుండును.

శ్లో, అంతర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోఽపి సన్,
పరిశ్రాంతతయా నిత్యం నిద్రాళురివ లక్ష్యతే.

తా. అయిదవభూమియందు చేరిన పురుషుఁడు సర్వ కాలములయందు నంతర్ముఖుఁడై యున్నందున చక్షురాదీంద్రియ ములు బాహ్యమునందుఁ బ్రవర్తించుచున్నట్లు కనుపడుచున్నప్ప టికి చిత్తవిశ్రాంతి కలవాఁడగుటచేత నిత్యము నిద్రించువాని వలె చూడఁబడుచుండును.

శ్లో. కుర్వన్నభ్యాసమేతస్యాం భూమికాయాం వివాసనః,
షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్పతతి భూమికాం.

తా. ఈసుషుప్తిభూమికయందు చిరకాల మభ్యాసము చేయుచుండి వాసనల నన్నిటిని విడిచినవాఁడై గాఢసుషుప్తి

ములను భావించుటకుఁగాని బాహ్యపదార్థములను గ్రహించు టకుఁగాని సామర్థ్యము లేనందున నాకాశమునందున్నకుంభము వలె వెలుపల లోపల శూన్యుఁడైయుండును. స్వయంప్రకాశ సచ్చిదానందైకరసునిగు పరబ్రహ్మయందు మగ్నుఁడైయున్నం దున బాహ్యాభ్యంతరములయం దంతటను పరబ్రహ్మస్వరూ పమునే చూచుచుండును గనుక సముద్రమున మునిఁగియున్న పూర్ణకుంభమువలె లోపల వెలుపల పూర్ణుఁడై యుండును. తురీయమనెడి యేడవభూమికను పొందినయోగికి స్వాతంత్ర్య ముగాఁగాని పరతంత్రముగాఁగాని వ్యుత్థానమే కలుగనేరదు. ఇట్టి యోగిశిరోమణిని సుద్దేశించి 'దేహం చనశ్వర' మను భాగ వతశ్లోకము ప్రవర్తించినది. అసంప్రజ్ఞాతసమాధిని బోధించు యోగశాస్త్రము లన్నియు నీభూమికయందే పర్యవసానము నొందుచున్నవి. ఈయేడవభూమిక యందుఁ జేరినయోగియే పూర్వోదాహృతశ్రుతియందు బ్రహ్మవిద్వరిష్ఠః అని చెప్పఁ బడెను. ఆఱవభూమికయందు జేరిన యోగి '[illegible]' అను శ్లోకము చేతను, ఏడవభూమికయందు చేరిన యోగి "దేహంచనశ్వరం" అను భాగవతశ్లోకమువలన చెప్పఁబడినందున నీరెండుశ్లోకములను పరస్పరవిరుద్ధము లేవని తెలియవలయును. ఇంతవరకు చెప్పిన భూమికాసప్తకమును గూర్చి సంగ్రహమును చెప్పెదము. పంచమాదిభూమికాత్రయరూపమైన జీవన్ముక్తి సంపాదింపఁబడిన పక్షమునందు ద్వైతప్రపంచప్రతిభాసము లేనందున సంశయవిపర్యయములు సంభవింపవు గనుక వేదాంత ప్రమాణమువలనఁబుట్టిన తత్త్వజ్ఞానము బాధింపఁబడకరక్షింపఁ

బడును. ఇట్టితత్త్వజ్ఞానరక్షణము జీవన్ముక్తికి మొదటిప్రయోజనము. రెండవ ప్రయోజనము తపస్సు, యోగభూమికలు దేవత్వాదిప్రాప్తికి హేతువు లగుటచేత తపస్సని తెలియవలెను.

యోగభూమికలు దేవత్వాదిప్రాప్తిసాధనము లనునర్థము శ్రీకృష్ణార్జునులయొక్కయు రామవసిష్ఠులయొక్కయు ప్రశ్నప్రతివచనముల చేతఁ దెలియఁబడుచున్నది.

అర్జునుఁ డడిగిన ప్రశ్న —

శ్లో. అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.

తా. మోక్షమార్గమునందు అల్పప్రయత్నమును జేసిన పురుషుఁడు గురువేదాంతవాక్యములయందు శ్రద్ధయును శమదమాదిగుణములును కలవాఁడై గురుసమీపమునకుఁ బోయి వేదాంతవాక్యశ్రవణమును చేయుచుండి తత్త్వసాక్షాత్కారమును బొందకయే మధ్యకాలమునందు మృతిఁ బొందిన నేమిగతిని బొందును?

శ్లో. కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.

తా. బ్రహ్మాత్మైక్యజ్ఞానములేనివాఁడైనందున ముక్తిని బొందక కర్మలను ఉపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములను బొందక ఉభయభ్రష్టుఁడై చెదరిపోయినమేఘశకలమువలె నశించిపోఁడుగదా.

అనఁగా స్వర్గప్రాప్తిసాధనములైన యాగదానాది కామ్యకర్మలను బ్రహ్మలోకప్రాప్తి సాధనములైన పంచాగ్నివిద్యాద్యుపాసనలను విడిచి నిష్కామకర్మయోగము ననుష్ఠించి దానివలన నిర్మలమైన చిత్తము కలవాఁడై శమదమాదిగుణములుగలిగి మోక్షమునందిచ్ఛగలవాఁడయి పరమహంససన్న్యాసాశ్రమము నంగీకరించి శ్రోత్రియ బ్రహ్మనిష్ఠ గురుసన్నిధియందు వేదాంతశాస్త్రమును యథావిధిగా శ్రవణముచేసి మనన నిదిధ్యాసనముల నాచరించు పురుషుఁడు అద్వితీయబ్రహ్మసాక్షాత్కారము గలుగులోపల కాలగతిచేత మరణము నొందిన పక్షమునకు తత్త్వసాక్షాత్కారము లేనందున వానికి మోక్షము నిశ్చయముగా లేదు. కర్మోపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములును లేవు. వేదోక్తకర్మలను విడిచినందున నరకము ప్రాప్తించునా! లేక శ్రవణము మొదలగు అనిషిద్ధకర్మల నాచరించుచున్నందునను, సురాపానాదినిషిద్ధకర్మల నాచరించనందునను స్వర్గాదిపుణ్యలోకములే ప్రాప్తించునా యని ప్రశ్న తాత్పర్యము.

ఇందులకు శ్రీకృష్ణమూర్తిచే చెప్పఁబడినయుత్తరము.

శ్లో. పార్థనైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.

తా. ఓయర్జునా, బ్రహ్మవిద్యావిచారము చేయు పురుషుఁడు ఈలోకమునందుఁగాని పరలోకమునందుఁగాని చెరుపునుపొందఁడు. పుణ్యకార్యములను జేయువానికి ఈలోకమున నపకీర్తి గాని పరలోకమునందు నరకము గాని కలుగనేరదు

శ్లో. ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

తా. బ్రహ్మసాక్షాత్కారముకొఱకు ప్రయత్నము చేయుచు బ్రహ్మసాక్షాత్కారము కలుగకముందే మృతిఁబొందిన పురుషుఁడు మృతికాలమునందు భోగవాంఛలు కలవాఁడై మరణమునుబొందెనా, మరణానంతరము అశ్వమేధాది మహాపుణ్య కార్యములను చేసిన మహానుభావులు పొందు బ్రహ్మలోకాది లోకములను అర్చిరాదిమార్గము వలనఁ బ్రవేశించి యచ్చట సమస్తభోగములను చిరకాల మనుభవించి తరువాత నీలోక మునం దాచారవంతులై మహాసామ్రాజ్యముగల క్షత్రియోత్త ములగృహములయందు జన్మించును.

పునర్జన్మ జనకాదులకుఁ గలదు.

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

తా. భోగవాంఛలు లేనియు కేవలముగా మృతిఁబొం దెనా, మరణానంతర మత్యల్పకాలమునందే బ్రహ్మతత్త్వా భ్యాసనిష్ఠులైనట్టి బ్రాహ్మణులయొక్క వంశములయందు శ్రీశుక జడభరతాదులవలె జన్మించును. సదాచారసామ్రాజ్యములు గల రాజవంశములయందు జన్మించుట దుర్లభము. బ్రహ్మతత్త్వా భ్యాసపరదరిద్ర బ్రాహ్మణవంశములయందు జన్మించుట యంత కంటె నింక దుర్లభము.

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన.

తా. పూర్వజన్మమందు బ్రహ్మాత్మతత్త్వానుభవమును ఏభూమిక వరకు నభ్యసించియుండెనో, ఆ భూమికను ప్రయత్నము లేకయే పొందును. అంతకు పై బడిన భూమికను పొందుటకు ప్రయత్నము చేయును. అట్లుగా సాధనచతుష్టయసంపన్నుడగుచు సదనవేదాంతవాక్యశ్రవణమనననిదిధ్యాసనము లనెడి మూడు భూమికలలో నే భూమికవరకు అభ్యసించి మృతిని బొందెనో ఆభూమికను ఉత్తరజన్మమందు ప్రయత్నములేకయే పొంది యుత్తరభూమికలను సాధించుటకు ప్రయత్నమును చేసి బ్రహ్మసాక్షాత్కారమును కలుగజేసుకొని ముక్తినొందును.

ఈప్రకారమే వాసిష్ఠరామాయణమునందు శ్రీరామ వసిష్ఠసంవాదములలో నిరూపింపబడియున్నది.

అప్పుడు శ్రీరాములవారు చేసిన ప్రశ్న.

శ్లో. [illegible],
ఆరూఢస్య [illegible].

తా. ఓ స్వామీ వసిష్ఠ! యను నాలుగవ జ్ఞాన భూమికను బొందినవానికి విదేహకైవల్యము నిశ్చయముగా కలదు కాని శుభేచ్ఛ యను మొదటి భూమికను గాని విచారణ యను రెండవభూమికను గాని తనుమానస యను మూడవ భూమికనుగాని పొంది, అప్పుడనే మృతినొందినవానికి ఏమిగతి కలుగును?

ఈప్రశ్నయొక్క తాత్పర్యమును పూర్వము అర్జుని ప్రశ్న తాత్పర్యమును వలె నూహించవలయును.

ఇందుకు వసిష్ఠమహర్షిచే చెప్పఁబడిన ప్రత్యుత్తరము.

శ్లో. యోగభూమికయోత్క్రాంతజీవితస్య శరీరిణః,
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతం.

తా. ఓ రామచంద్రా, మొదటి యోగభూమికలు మూటిలో నొకదానియందుండి మృతినొందినవానికి ఆయా భూమికాస్వభావము ననుసరించి పూర్వపాపములు నశించును. అనఁగా మొదటిభూమికలో నుండి మృతినొందినవానికి కొంచెముపాపమును రెండవభూమికలో నుండి మృతినొందినవానికి మరికొంత యెక్కువపాపమును మూడవభూమికలో నుండి మృతి నొందినవానికి ఇంక నెక్కువపాపమును నశించు నని భావము.

శ్లో. తత స్సురవిమానేషు లోకపాలపురేషు చ,
మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః.

తా. దుష్కృతనాశతారతమ్యము ననుసరించి దేవతల విమానములయందు ఇంద్రాదిలోకపాలుర పట్టణములయందు మేరుపర్వతోపవనోద్యానములయందును రంభాద్యప్సరసలతో క్రీడించును.

శ్లో. తత స్సుకృతసంభారే దుష్కృతే చ పురాకృతే,
భోగక్షయపరిక్షీణే జాయంతే యోగినో భువి.
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సదా.

తా. ఈప్రకారముగా ననేకసంవత్సరములు క్రీడించిన తరువాత పూర్వజన్మకృతపుణ్యమును పాపమును నశించఁగానే తిరిగి భూమిలో సదాచారసంపన్నులయి మహారాజైశ్వర్యము గల క్షత్రియోత్తములవంశములో జన్మింతురు.

శ్లో. తత్ర ప్రాగ్భవనాభ్యస్తం యోగభూమిత్రయం బుధః,
ప్రాప్యనిష్కామకర్మైవ ప్రమాదాత్పతితే భూమికాం.

తా॥ ఆజన్మమందు పూర్వజన్మములో నభ్యసించిన భూమికలను అనాయాసముగ లభించి వాటికి పైభూమికలను సాధనాభ్యాసక్రమముచే పొందును.

ఇందుచేత యోగభూమికలు పుణ్యలోకప్రాప్తిసాధనము లని తెలియఁబడుచున్నది.

ఆక్షేపము — ఓగురూ, యోగభూమికలు మీరు చెప్పిన ప్రకారము బ్రహ్మలోకాదిపుణ్యలోకములను పొందించుటకు సాధనము లని యంగీకరించఁదగియున్నది కాని యీయోగభూమికలు తపస్సని చెప్పుటకు మాత్రము ప్రమాణమును గానము.

సమాధానము — ఇందుకు ప్రమాణము శ్రుతివాక్యమే యని చెప్పెదము. ఆశ్రుతివాక్యమును ఉదాహరించెదము.

తైత్తిరీయశాఖయందు,

శ్రు. తపసా దేవా దేవతా మగ్ర ఆయన్ తపసర్షయస్సువరన్వవిందన్.

తా. పూర్వకల్పమునందు కొందఱు పురుషులు దేవత్వమును పొంద నిచ్ఛగలవారై తపస్సు నాచరించి యీకల్పముయొక్క మొదటను దేవత్వమును బొందిరి. భృగ్వాదిఋషులు తపస్సుచేతనే స్వర్గలోకమును బొందిరని శ్రుత్యర్థము.

తత్త్వజ్ఞానోత్పత్తికి పూర్వమం దున్న మూడుభూమికలు తపస్సని చెప్పఁబడుచుండఁగా తత్త్వజ్ఞానోత్తరకాలమం దున్న

ఈయర్థము పురాణములో చెప్పఁబడియున్నది.

శ్లో. యస్యానుభవపర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః.

తా. ఏపురుషునియొక్క బుద్ధి పరమార్థతత్త్వమైన పరబ్రహ్మస్వరూపమునందు సాక్షాత్కారపర్యంతము వ్యాపించునో, అట్టి మహాపురుషునియొక్క కటాక్షమునకు గోచరించిన మనుష్యు లందఱు సమస్తపాపములచేత విముక్తులై పరిశుద్ధులై సమస్తపుణ్యములను బొందుదురు.

శ్లో. దర్శనధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః,
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్సాధుసమాగమః.

తా. లోకములలో మత్స్యములు, కూర్మములు, పక్షులు తమతమపిల్లలను దర్శనముచేత ధ్యానముచేత స్పర్శచేతను ఏప్రకారముగా పోషించునో యాప్రకారమే బ్రహ్మతత్త్వజ్ఞానముగల యోగులు సంసారులైన లోకుల ననుగ్రహించి రక్షించెదరు. అనఁగా మత్స్యములు తమపిల్లలను కన్నులతో చూచినమాత్రాన రక్షించును. కూర్మములు పిల్లలను మనస్సులో తలఁచినమాత్రాన రక్షించును. పక్షులు స్పర్శనమును చేసినమాత్రాన పిల్లలను రక్షించును. ఇదేప్రకారము సత్పురుషులైన యోగులు మందాధికారులను దృష్టిచేతను మధ్యమాధికారులను మనస్సులో వీరు కృతార్థు లగుదురు గాక యని ధ్యానించుటచేతను ఉత్తమాధికారులను హస్తమస్తకసంయోగరూపమయిన స్పర్శచేత ననుగ్రహించి రక్షించెదరని తాత్పర్యము.

ఈప్రకారముచేత సర్వవిధోపకారిత్వము యోగియందు కల దని అభియుక్తులచేఁ జెప్పఁబడినది.

శ్లో. స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తావని
ర్యజ్ఞానాం చ కృతం సహస్రమఖిలం దేవాశ్చ సంపూజితాః,
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరస్త్రైలోక్యపూజ్యోఽప్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

తా. ఎవనియొక్క చిత్తము పరబ్రహ్మవిచారమందు నిమిషకాలమైనా స్థిరముగా నుండునో అట్టి మహానుభావుఁడు గంగాయమునాదిసమస్తతీర్థములయందు స్నానము చేసినవాఁడే యావద్భూమండలమును సత్పాత్రులైన బ్రాహ్మణులకు యోగ్యమైన దేశకాలములయందు దానము చేసినవాఁడును ఏకాహయాగము మొదలు సహస్రసంవత్సరములవఱకు నెన్ని యాగములు కలవో వానినన్నిటిని సమగ్రముగా ననుష్ఠించినవాఁడును హరిహరహిరణ్యగర్భాదిదేవతల నందఱిని సత్కార్యములచేత నానందింపఁజేసినవాఁడును గయాశ్రాద్ధాదులను చేసి తనపితృదేవతలనందఱిని సంసారమండలములోనుండి లేవనెత్తి బ్రహ్మలోకమును జేర్చినవాఁడును మూఁడులోకములయం దున్న సమస్తజనులచేత పూజింపఁబడువాఁడును అగును.

శ్లో. కులం పవిత్రం జననీ కృతార్థా వసుంధరా పుణ్యవతీ చ తేన,
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

తా. ఎవనియొక్కచిత్తము అపరిచ్ఛిన్నజ్ఞానానందస్వరూపుఁడయిన పరమాత్మయందు సుస్థిరమై యుండునో, వాని

ఇచ్చట దానమను పదము లేకపోయినా శ్రు. 'అథ యత్తపో దానమార్జవమహింసా సత్యవచనమితి తా అస్య దక్షిణా' యను ఛాందోగ్యశ్రుతి ననుసరించి దానశబ్దమును అధ్యాహారమును చేయవలయును తపస్సు దానము ఆర్జవము అహింస సత్యవచనము (యథార్థభాషణము) ఇవి దక్షిణ యని ఛాందోగ్యశ్రుత్యర్థము. వాగింద్రియము హోత యను ఋత్విజుడు. ప్రాణము ఉద్గాతయను ఋత్విజుడు, చక్షురింద్రియము అధ్వర్యుడను ఋత్విజుడు. మనస్సు బ్రహ్మయను ఋత్విజుడు. శ్రోత్రేంద్రియము అగ్నీధ్రుడను ఋత్విజుడు.

ఉక్తానువాకము యొక్క మధ్యభాగములో యోగియగు తత్త్వజ్ఞానియొక్క వ్యాపారములు జీవితకాలమును జ్యోతిష్టోమాదియాగములుగాను పౌండరీకాద్య సత్రక్రతువుల యొక్క అవయవములుగాను చెప్పబడినవి.

శ్రు. యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవిర్యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యా వ్యాహృతిరాహుతిర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాతరత్తి తత్సమిధం యత్ప్రాతర్మధ్యందినం సాయం చ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యేऽర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబంధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేऽహర్గణాః సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం తదవభృథః. అని.

తా. తత్త్వజ్ఞానియొక్క అవధారణము (నిశ్చయము) ఏదికలదో అదియే దీక్షయని చెప్పబడును. తత్త్వజ్ఞానియొక్క

భోజనము హవిస్సని (హోమద్రవ్య మని), జలపానము సోమ
పాన మని, క్రీడావ్యాపారములు ఉపసత్తులనెడి యిష్టివిశేషము
లని, సంచారోపవేశోత్థానములు మూడు ప్రవర్గ్యలనెడి యిష్టి
విశేషము లని, ముఖము ఆహవనీయమనెడి అగ్నియని, సంభా
షణము ఆహుతి యని, విజ్ఞానము హోమ మని, సాయంకాల
ప్రాతఃకాలములయందు చేయు భక్షణము సమిద్యాగ మని,
ప్రాతఃకాలమధ్యాహ్నకాలసాయంకాలములు మూడు మూడు
సవనము లని, అహోరాత్రములు దర్శపూర్ణమాసము లని,
పక్షములును మాసములును చాతుర్మాస్యయాగములని, వసం
తాదిఋతువులును పశుబంధములని, సంవత్సరపరివత్సరము
లు అహర్గణము లని చెప్పఁబడును. అహోరాత్రములు మొద
లు సంవత్సరపరివత్సరములవఱకు చెప్పిన కాలావయవములతోఁ
గూడిన తత్త్వజ్ఞానియొక్క ఆయుష్కాలమును సర్వస్వమును
దక్షిణగా నియ్యఁదగిన సత్రయాగమని చెప్పఁగను. కనుకనే
తత్త్వజ్ఞానియొక్క మరణమే యీసత్రయాగమున కవభృథ
మని చెప్పఁబడును.

ఉత్తరానువాకముయొక్క చరమభాగములో తత్త్వజ్ఞాని
చరిత్రమును సాయుజ్యరూపముగా నుపాసించువానికి
సూర్యచంద్రులను కార్యబ్రహ్మలయొక్క తాదాత్మ్య రూపమైన
క్రమమోక్షము ఫలించు నని చెప్పఁబడినది.

శ్రు. ఏతద్వై జరామర్యం అగ్నిహోత్రం సత్రం య ఏవం విద్వాను
దగయనే ప్రమీయతే దేవానామేవ మహిమానంగత్వాదిత్యస్య
సాయుజ్యం గచ్ఛతి అథయో దక్షిణే ప్రమీయతే పితృణామేవ

బడి యుండెనుగదా. ఈజీవన్ముక్తిదశయందు క్రోధరాహిత్యాది ధర్మములు ఏప్రకారము స్మరింపఁబడుచున్నవి?

సమాధానము—— వాస్తవము. కనుకనే జీవన్ముక్తునియందు క్రోధాదు లుండునా యని శంకించుటకు కూడ నవకాశము లేదు. జీవన్ముక్తికి చాల ప్రాచీనకాలమం దనుష్ఠింపఁబడిన వివిదిషాసన్న్యాసమునందే క్రోధాదులు ప్రసక్తములు కాక యుండఁగా సర్వోత్తమమగు తత్త్వజ్ఞానదశయందు క్రోధాదు లేప్రకారము సంభవించును! తత్త్వజ్ఞానదశయందే సంభవింపని క్రోధాదులు విద్వత్సన్న్యాసమందుఁగాని జీవన్ముక్తియందుఁగాని బొత్తుగా ప్రసక్తములు కానేరవు కనుక వివిదిషాసన్న్యాసమునం దభ్యసించఁబడి జీవన్ముక్తిదశయందు అనువర్తించి వచ్చు క్రోధరాహిత్యాదుల నిచ్చట నుదాహరించిన స్మృతి వాక్యముచేత ననువదింపఁబడుచున్నవి గాని విధింపఁబడ లేదు.

కనుక తత్త్వజ్ఞుఁడగు యోగితో లౌకికపురుషున కెప్పటికిని కలహము సంభవించనేరదు.

నిందింపఁదగిన విషయము యోగియందు లేనందున నిందారూపమయిన వివాదముకూడ లౌకికపురుషునకు యోగియందు సంభవించదు

ఈయర్థము కూడ ఒకస్మృతియందుఁ దెలుపఁబడియున్నది.

శ్లో. యన్న సంతం న చాసంతం నాశ్రుతం న బహుశ్రుతం,
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్స వై యతిః. ఇతి.

తా. ఏపురుషుఁడు మరియొకపురుషుని ఉత్తమజాతి కలవాఁడనిగాని హీనజాతికలవాఁడని గాని మూర్ఖునిగాఁగాని

పండితునిగాఁగాని మంచియాచారముగలవానిగాఁగాని దురాచారము గలవానిగాఁగాని యెఱుఁగఁడో అట్టిపురుషుఁడే యతి యని జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

అనఁగా అన్యులయందు నీచోత్తమాదిభేదబుద్ధి గలిగి వ్యవహరించువానితో కలహించుట కవకాశము గలిగియుండును. సర్వత్ర సమబుద్ధి గలిగి వ్యవహరించు జీవన్ముక్తపురుషునితో కలహించుట కెవరికి నవకాశము గలుగ దని తాత్పర్యము.

కనుక శాస్త్రజ్ఞుఁడగువాఁడును యోగితో వివాదమును బొందఁడు.

శాస్త్రజ్ఞుఁడు యోగితో శాస్త్రమందు వివాదమును పొందునా? లేక యోగియొక్క చరిత్రమందు వివాదమును బొందునా!

శ్రు. తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ,
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్.

అను శ్రుతుల ననుసరించి యోగీశ్వరుఁడు పరశాస్త్ర ప్రమేయములను దూషింపఁడు గనుక శాస్త్రవేత్తను యోగితో శాస్త్రప్రమేయమందు వివాదము సంభవింపదు. పరశాస్త్ర ప్రమేయములను దూషించినఁగదా పరశాస్త్రవేత్తలు కలహించుదురు. దృశ్యమానాత్మక ప్రపంచమున కధిష్ఠానమైన యాపరమాత్మ నొకనినే తెలుసుకొనుఁడీ ఇతరమైన వాక్యములను విడువుఁడీ బ్రహ్మజ్ఞానోపయుక్తములు గాని వాక్యముల నన్నిటిని విడువవలయును. ఇతరవాక్యముల నుచ్చరించుట వాగిం

జ్ఞానము నవి మొదలయిన గుణములు కలిగిన యంతఃపురము నాశ్రయించినట్లు యోగీశ్వరుని నాశ్రయించును.

శ్లో. పేశలాచారమధురం సర్వే వాంఛంతి తం జనాః,
వేణుం మధురనిర్ధ్వానం వనే వనమృగా ఇవ.

తా. సర్వజనప్రియంకరమైన అనుష్ఠానముచేత నొప్పుచున్న మహాతత్త్వజ్ఞుని సకలజనులు కోరుచుందురు. అనఁగా వనమందు మధురముగా ధ్వనిచేయుచున్న బొంగువెదురును విడువఁజాలక వనమృగములు దానిచుట్టు ముట్టుకొని యున్నట్లు సకలజనులు తత్త్వజ్ఞానియొక్క సన్మార్గప్రవృత్తిని జూచి విడువఁజాలక వానిని సర్వకాలసర్వావస్థలయందును ముట్టుకొనియుందురని భావము.

శ్లో. సుషుప్తవద్విగతభావవృత్తికా
స్థితిస్సదా జాగ్రతి యస్య చేతసః,
కలాన్వితో విధురివ యస్సదా బుధై
స్సంసేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః.

తా. ఏపురుషుఁడు జాగ్రదవస్థయందు కూడ సుషుప్తిదశయందు వలె సమస్తవిషయాకారవృత్తులను విడిచి కేవలముగా నున్నచిత్తముతో గూడియుండునో సంపూర్ణకళలు గల చంద్రుఁడే ప్రకారము దేవతలచేత సేవింపఁబడునో ఆప్రకారమే పండితులచేత సర్వకాలములయందును నేపురుషుఁడు సేవింపఁబడునో, అట్టి పురుషుఁడు ఈలోకములో ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. మానేన కేచిం తేజాంసి వినయాని స్మృతాని చ,
విజ్ఞానమయా భావాని సర్వాణి శమకాని చ.

తా॥ ఈలోకములో సాధువులు కఠినులు కూడ తమ తల్లియందే ప్రకారము విశ్వాసముగలవారై యుందురో యాప్రకారమే శమము ప్రధానముగాఁగల పురుషునియందు సమస్త భూతములు విశ్వాసమును బొందియుండును.

శ్లో॥ తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ,
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే.

తా॥ తపస్సును చేయువారియందు సకలశాస్త్రపాండిత్యము గలవారియందు యాగాదిపుణ్యకార్యములు చేసిన వారియందు మహారాజులయందు బలవంతులయందు సమస్తసద్గుణములు కలవారియందును శమగుణము గల పురుషుఁడే యధికముగా ప్రకాశించును.

ఈ చెప్పిన ప్రకారము జీవన్ముక్తికి విసంవాదాభావమను మూఁడవ ప్రయోజనము నిర్బాధముగా కనుఁబడుచున్నది.

దుఃఖనాశసుఖావిర్భావముల చతుర్థ పంచమ ప్రయోజనములు బ్రహ్మానందగ్రంథములోని విద్యానందమను నాలుగవ యధ్యాయమునందు నిరూపింపఁబడియున్నవి. ఆరెంటిని సంగ్రహముగా నిచట చెప్పెదము.

శ్లో॥ ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్.

తా॥ ఏపురుషుఁడు సర్వభూతములయొక్క హృదయములయందుండి అనేనాయాసనో సహాయుఁడైన ఆత్మను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడైన పరమాత్మనుగా తెలుసుకొనెనో, ఆ పురుషుఁడు యేప్రయోజనముకొరకు నేఫలమును కోరి శరీర

మూడువిధములు. హిరణ్యగర్భుఁడు మొదలు స్తంబమువరకుఁ గల సర్వదేహములయందు ననుగతమైన సాక్షిచైతన్యరూపమయిన యే బ్రహ్మ కలదో ఆ పరబ్రహ్మము నేనే యని తెలిసికొనియున్న పురుషుఁడు స్వదేహమునందు వలె సర్వదేహములయందును సర్వకామములను సాక్షిగా నుండును.

ఈయభిప్రాయముతోనే శ్రు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ, బ్రహ్మణా విపశ్చితా' అను శ్రుతి ప్రవర్తించినది.

బ్రహ్మతత్త్వజ్ఞానము గలపురుషుఁడు అఖండచిద్విజ్ఞానస్వరూపమయిన బ్రహ్మము తానే అయి సకలమయిన కామములను పొందును అని శ్రుత్యర్థము. లోకములో భోగము లనుభవించఁబడినతరువాత నాభోగములవిషయమును నిచ్ఛ లేకుండుట యను అకామహతత్వము శ్రోత్రియునకు నుండును. సర్వభోగములయందు వినాశాదిదోషములను జూచుచున్న తత్త్వజ్ఞానికి సర్వభోగములయం దిచ్ఛ కలుగనందున సర్వత్ర అకామహతత్వము కలిగియుండును. కనుకనే సార్వభౌమమహారాజును ఆరంభించి హిరణ్యగర్భునివరకు నుత్తరోత్తర శతగుణాధిక్యముతోఁ జెప్పఁబడినయానందములయందు 'శ్రోత్రియస్య చాకామహతస్య' అని వినఁబడుచున్నది. సర్వభోగములయందు నిచ్ఛలేని శ్రోత్రియుఁడైన విరక్తునికి నీయానందము కలదని శ్రుత్యర్థము.

సద్రూపముచేతను చిద్రూపముచేతను ఆనందరూపముచేతను సర్వపదార్థములయందు ననుగతమయియున్న స్వస్వరూ

పము ననుసంధించువానికి సర్వభోక్తృత్వము కలదని తైత్తిరీయోపనిషత్తులో వినఁబడుచున్నది.

శ్రు. అహమన్న మహమన్నమహమన్నం. అహమన్నాదో౽హమన్నా దో౽హమన్నాదః. అని.

తా. బ్రహ్మాత్మతత్త్వజ్ఞానము గలిగి ముక్తిఁగాంచినపురుషుఁడు తనకృతార్థత్వమును భావించి సర్వముతో అద్వితీయ మయి, నిరంజనమయిన ఆత్మను నేనే అయినప్పటికీ, ఈలోకము నందుఁ గల అన్నమును (భోగ్యములను), అన్నాదుఁడను (భోక్తను) నేనే యని అనుసంధించుచుండు నని శ్రుత్యర్థము.

కృతకృత్యత్వము స్మృతియందు స్మరింపఁబడినది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

తా. పరబ్రహ్మతత్త్వజ్ఞానముచేత తృప్తి నొంది కృతకృత్యుఁడయిన యోగికి కర్తవ్యమయిన విషయము ఏమియు నుండదు. ఉండెనో, అతఁడు తత్త్వవేత్తయే కాఁడు.

శ్లో. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే.

తా. ఏపురుషుఁడు ఆత్మస్వరూపమునందే రతిగల వాఁడై యుండునో, ఉద్యానాదులయందు రతిగలవాఁడై యుండఁడో, ఆత్మచేతనే తృప్తినొందునో, అన్నాదులచేత తృప్తి నొందఁడో, ఆత్మయందే సంతోషమునొందుచుండునో, పుత్ర ధనాదిప్రాప్తిచే సంతోషము నొందఁడో, అట్టి తత్త్వజ్ఞాని యయిన పురుషునకు కర్తవ్యము కొంచెమయినా కలిగియుండఁడు.

శ్రు, 'అభయం వై జనక ప్రాప్తోఽసి' 'తస్మాత్తత్సర్వమభవత్' 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి.'

అనుశ్రుతులచేత ప్రాప్తప్రాప్యత చెప్పంబడి యున్నది. ప్రాప్తప్రాప్యత అనఁగా పొందఁదగిన యర్థములన్నియుఁ బొందఁబడియుండుట. ఓజనకమహారాజా, నీవు సర్వపురుషార్థశ్రేష్ఠమైన అభయమును మోక్షమును పొందితివి. ఇఁకను నీవు పొందవలసిన విషయము మరియొకటి లేదు కనుకనే సర్వాత్మక బ్రహ్మస్వరూపుఁడాయెను. ఏపురుషుఁడు సత్యజ్ఞానానందాద్వితీయ పరమాత్మను నేనే యని ప్రత్యక్షముగా తెలియునో ఆపురుషుఁడు బ్రహ్మయే యగు నని మూఁడు శ్రుతుల కర్థము.

ఆక్షేపము—ఓయీ, మీచే చెప్పఁబడిన దుఃఖనాశసుఖప్రాప్తులు కేవలము తత్త్వజ్ఞానముచే సిద్ధించుచుండఁగా జీవన్ముక్తియొక్క ప్రయోజనము లని చెప్పుట న్యాయము కాదు.

సమాధానము— సురక్షితములైన దుఃఖనాశసుఖప్రాప్తులు జీవన్ముక్తికి ప్రయోజనములని మాయభిప్రాయమై యున్నది. అనఁగా తత్త్వజ్ఞానము పూర్వమే పుట్టియున్నప్పటికి జీవన్ముక్తిచేత నేప్రకారముగా రక్షింపఁబడునో ఆప్రకారమే దుఃఖవినాశసుఖప్రాప్తులును కూడ తత్త్వజ్ఞానముచే సిద్ధించినప్పటికి జీవన్ముక్తిచేత రక్షింపఁబడును. ఇట్లు రక్షితములైన దుఃఖవినాశ సుఖప్రాప్తులు జీవన్ముక్తికి ప్రయోజనములని చెప్పుట న్యాయవిరుద్ధము కాదని తాత్పర్యము.

ఆక్షేపము — ఓయీ, యీ ప్రకారము జీవన్ముక్తి అయిదు ప్రయోజనములు కలిగినదై యుండఁగా సమాహితచిత్తుఁడైన యోగీశ్వరుఁడు లోకవ్యవహారమునందుఁ బ్రవర్తించుచున్న తత్వజ్ఞానికంటె నుత్తముఁడని చెప్పవలసియుండును. అలాగున చెప్పడము యుక్తము కాదని రామవసిష్ఠసంవాదవాక్యముల చేత కనుబడుచున్నది.

రాములవారిచేఁ జేయఁబడిన ప్రశ్న.—

శ్లో. భగవన్ భూతభవ్యేశ కశ్చిజ్జ్ఞాతసమాహితః,
ప్రబుద్ధో వ్యవహారేషు విశ్రాన్తో వ్యవహారవాన్.
కశ్చిదేకాన్తమాశ్రిత్య సమాధినియతః స్థితః,
తయోస్తు కతరః శ్రేయానితి మే భగవన్వద.

తా. భూతభవిష్యత్స్వరూపుల సర్వులను నియమించు స్వభావముగల ఓస్వామీ! యీలోకములో నొకపురుషుఁడు తత్త్వజ్ఞానముగలవాఁడయి లోకవ్యవహారముల నాచరించుచు విశ్రాంతి కలవాఁడయి యుండును. మఱియొకఁడు ఏకాంతమునం దుండి సమాధి నాచరించుచుండును. వీరిద్దరిలో నెవ్వఁడు శ్రేష్ఠుఁడుగానుండును. ఆయర్థమును నాకు విశేషముగాఁ జెప్పవలయును.

ఇందుకు వసిష్ఠమహాముని చెప్పిన ఉత్తరము.—

శ్లో. ఇమం గుణసమాహార మనాత్మత్వేన పశ్యతః,
అంతశ్శీతలతా యాఽసౌ సమాధిరభిధీయతే.

తా. ఈదృశ్యమానమయిన దేహేంద్రియమనఃప్రాణాదిప్రపంచమును ఆత్మ కాదని తెలుసుకొనియుండు పురుషు

శ్లో॥ అంతశ్శీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్,
అంతస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్.

తా॥ హృదయమునందు శీతలత్వము పుట్టినక్షణమందీజగత్తు శీతలస్వభావముగలదై హృదయములో హాయిని కలుగఁజేయును. తృష్ణ యనఁగా ఆశ. ఆయాశచేత హృదయమునందు బాధింపఁబడువారికి దావాగ్నివలె నీజగత్తు విదాహమును పుట్టించును.

ఇందుచేత తృష్ణాదిదోషములు హృదయములో లేకయుండుటయే అంతశ్శీతలత్వమని చెప్పఁబడుచున్నది.

ఆక్షేపము — ఓయీ! యోగవాసిష్ఠసంవాదవాక్యములయందే సమాధినిష్ఠయును, లోకవ్యవహారముయొక్క ప్రశంసయును కనఁబడుచున్నది.

శ్లో॥ సమాధిస్థానకస్థస్య చేతశ్చేత్ప్రవిచంచలం,
తత్తస్యాసమాధానం సమమున్మత్తతాండవైః.

తా॥ సమాధియందుండు పురుషునియొక్క చిత్తము విషయాంతరములను గ్రహించుస్వభావముచేత చంచలమై యుండెనా, ఆపురుషునియొక్క సమాధి పిచ్చివాఁడు చేయు తాండవముతో సమానమై యుండును. అనఁగా నిష్ప్రయోజనమని భావము.

శ్లో॥ ఉన్మత్తతాండవస్థస్య చేతశ్చేచ్ఛాంతిమాగతం,
తత్తస్యోన్మత్తనృత్యం తు సమం బ్రహ్మసమాధినా.

తా॥ పిచ్చివానినృత్యమువలె నిష్ప్రయోజనమయిన లోకవ్యవహారము ననుష్ఠించు పురుషునియొక్క చిత్తము వాసనాక్షయము గలిగియుండెనా, ఆపురుషునియొక్క లోకవ్య



శ్రీహయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తిప్రకాశిక

## ౪-వ ప్రకరణము.

హరిః ఓమ్.

ఇఁకను జీవన్ముక్తికి ఉపకారకమైన విద్వత్సన్న్యాసమును నిరూపించెదము.

విద్వత్సన్న్యాసము పరమహంసోపనిషత్తులో చెప్పఁబడినది. ఆ ఉపనిషత్తును ఇచ్చట ననువదించి వ్యాఖ్యానమును చేసెదము. అందు విద్వత్సన్న్యాసయోగ్యమైన ప్రశ్నను ముందుగా చేసియున్నారు.

ప్ర. అథ యోగినాం పరమహంసానాం కోఽయం మార్గస్తేషాం కా స్థితిరితి నారదో భగవన్తముపగత్యోవాచ.

టీ. ఇచ్చట అథశబ్దమునకు ఆనంతర్య మర్థము కాదు. ప్రశ్నయే యర్థము. ని. 'మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ' అని నిఘంటువువలన మంగళము, ఆనంతర్యము, ఆరంభము, ప్రశ్నము, సాకల్యము ఇవి అథశబ్దార్థము లని చెప్పఁబడి యున్నవి. కనుక విద్వత్సన్న్యాసమునుగూర్చి ప్రశ్న చేయఁబడుచున్నది. అథశబ్దార్థము బ్రహ్మాత్మైక్యజ్ఞానముగలిగి లోకవ్యవహారములచేత విక్షేపము నొందుచున్న చిత్తముగల

శ్రు. తం భగవానాహ సోఽయం పరమహంసానాం ముఖ్యోమార్గః. లోకే దుర్లభతరో న తు బాహుళ్యం.

తా. నారదునిఁగూర్చి చతుర్ముఖుఁడు చెప్పుచున్నాఁడు. ఈముందు చెప్పఁబోవునది పరమహంసలయొక్క ముఖ్య మార్గము.

ఇది లోకములో నింత దుర్లభము. ప్రచురముగా లేదు.

శ్రుతిలో 'సః' అనుశబ్దముచేత నేమార్గము అడుగఁబడెనో, అది పరామర్శింపఁబడినది. 'అయం' అను శబ్దముచేతను ముందు గ్రంథములో చెప్పఁబడు దండాచ్ఛాదనాదిరూపములు స్వశరీరోపభోగములచేతను లోకోపకారముచేతను నిరపేక్షమయిన ముఖ్యమార్గము పరామర్శింపఁబడుచున్నది. పరము కాష్ఠను బొందిన యుక్తినైర్గుణ్యము లోకములో నెచ్చటను కనుపడనందున నీమార్గము దుర్లభమని చెప్పఁబడినది. లోకములో నెచ్చటను కనుపడకపోయినమాత్రమున నీమార్గము అత్యంతాభావమని శంకింపఁదగదను నభిప్రాయముతో న తు బాహుళ్యమనుశబ్దముచేత నీమార్గము ప్రచురముగా లేదని చెప్పినది.

ఓయీ! యీమార్గము దుర్లభమయినపక్షమునకు దాని వలన ప్రయోజనము లేనందున దానినిమిత్తమయి ఆయాసము చేయఁదగదు అని శంకించుకొని చెప్పుచున్నారు.

శ్రు. యద్యేకోఽపి భవతి స ఏవ నిత్యపూతస్థః, స ఏవ వేదపురుష ఇతి విదుషో మన్యంతే.

పరమహంసయే 'స ఏవ' అనుశబ్దముచేత చెప్పఁబడుచున్నాఁడు. ఇతఁడే వేదపురుషుఁడు వేదమందు ప్రతిపాదింపఁబడిన పురుషుఁడని అర్థము. శ్రు. 'బ్రహ్మవిదాప్నోతి పరం' ఇది మొదలయినశ్రుతులు బ్రహ్మ యని చెప్పిన యిట్టి యోగియైన పరమహంసయే యని తాత్పర్యము.

బ్రహ్మానుభవవిత్త్వశ్రాంశములను ప్రతిపాదించినశాస్త్రములను చక్కఁగాఁ దెలిసినవారు విద్వాంసులని చెప్పఁబడుదురు. అట్టి విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మ యనే చెప్పెదరు. ఇతరజనులు మాత్రము బ్రహ్మనిష్ఠుఁడని చెప్పెదరని పరమతాత్పర్యము.

విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మగానే తలఁచెదరనెడియర్థము స్మృతివచనముచేత కూడ చెప్పఁబడుచున్నది.

శ్లో. జ్ఞానాజ్ఞానే విహాయైవ స్వయం కేవలరూపతః,
యస్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం.

తా. ఏపురుషుఁడు జ్ఞానాజ్ఞానములను రెంటిని విడిచి కేవలస్వరూపముతోఁ బ్రకాశించుచుండునో ఆపురుషుఁడు సాక్షాత్పరబ్రహ్మమే కాని బ్రహ్మవేత్తయని చెప్పఁదగఁడని యర్థము

కనుక యోగికి పరమహంసత్వము దుర్లభమయినందున ప్రయోజనము లేదని శంకింపఁదగదు.

శ్రు. మహత్పురుషో యుక్త్వా తస్య స్వర్గో ముక్త్యానపతిష్ఠతే. తస్మాదహం
న తస్మిన్నేవాన్తిష్ఠతే.

ఇదిగాక అవిద్యయా అవిద్యచే నారోపింపబడిన కర్తృత్వము విద్యచేత నివర్తింపబడినప్పటికి అవిద్యాభ్యాససహితమయి యనేకసహస్రవికారములతో నెప్పటికిని కూడియున్న అంతఃకరణోపాధియందు ప్రతిష్ఠితమయియున్న కర్తృత్వము అంతఃకరణము ఉండునంతను నుండు స్వభావము గలది గనుక తత్త్వవేత్తలయందు కర్తృత్వము సుతరాం నివర్తించు నని శంకింపదగదు.

ఆక్షేపము.—ఓయీ యాచార్యా! తత్త్వవేత్తకు కర్తృత్వము కొంచెముగా నుండు నని చెప్పితే 'జ్ఞానామృతేన తృప్తస్య' అను స్మృతివచనము విరోధించును. ఆ వచనమందు తత్త్వవేత్తకు కర్తృత్వాంశము కొంచెమైనను లేదని కదా చెప్పియున్నది.

సమాధానము—ప్రస్తుతవిద్వత్సన్యాసాధికారికి తత్త్వజ్ఞానము కలిగియున్నప్పటికిని చిత్తవిశ్రాంతి లేకపోవుటచేత తృప్తియుండదు గనుక చిత్తవిశ్రాంతిసంపాదనయందు కర్తవ్యాంశము కలిగి యున్నందున కృతకృత్యత్వము సంపూర్ణముగా లేదు గనుకనే విద్వత్సన్యాసాధికారికి కర్తవ్యము కొంచెముగాఁ గల దని చెప్పినది. 'జ్ఞానామృతేన తృప్తస్య' అనుస్మృతివచనము పంచమషష్ఠసప్తమభూమికలయందున్న తత్త్వవేత్తల నుద్దేశించి ప్రవర్తించినది గాని విద్వత్సన్యాసాధికారిగానుండు చతుర్థభూమికానిష్ఠునివిషయమయి ప్రవర్తించినది కాదు గనుక విరోధము లేదు.

ఆక్షేపము.—ఓయీ! తత్వవేత్తకు కూడ విధిబద్ధత కలదని చెప్పితే విధిజన్యమయిన అపూర్వమువలన జన్మాంతరము కూడ సంభవించును. అనఁగా శ్రు. 'అహరహస్సంధ్యాముపాసీత' యావజ్జీవ మగ్నిహోత్రం 'జుహోతి' ఇత్యాది విధివాక్యముల ననుసరించి చేయఁబడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలవలన సంభవించు పుణ్యమువలన జన్మాంతరము కలుగునని భావము.

సమాధానము.—విధిననుసరించి తత్వవేత్తలచేత చేయఁబడు నిత్యనైమిత్తికకర్మలవలన నపూర్వము పుట్టును గాని ఆ యపూర్వమునకు జన్మాంతరము ఫలము కానేరదు. చిత్తవిశ్రాంతికి ప్రతిబంధకము లైన పాపములను నివారించుటయే ఫలము. కర్మకుఁ గాని కర్మజన్యాపూర్వమునకుఁ గాని ప్రత్యక్షఫలము సిద్ధించుచుండఁగా అప్రత్యక్షఫలమును కల్పింపఁదగదని న్యాయవేత్తలు చెప్పుచున్నారుగనుక నే 'వ్రీహీనవహన్యాత్' అను వాక్యమునందు అవహననమును (దంచుటయను) కర్మకు ప్రత్యక్షమయిన తండుల సంపాదనమే (బియ్యమును జేయుటయే) ఫలము గాని అగ్నిహోత్రాది కర్మలకు వలె అప్రత్యక్షమయిన స్వర్గాదులు ఫలము కాదని చెప్పియున్నది. 'అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్' అను సూత్రమందీయర్థము విస్పష్టముగా చెప్పఁబడియున్నది. తత్త్వవేత్తవలన ననుష్ఠింపఁబడు అగ్నిహోత్రాది కర్మలు తత్త్వజ్ఞానము ఏ ఫలమును కలుగఁ జేయునో ఆ ఫలమునే కలుగఁజేయును గాని జన్మాంతరప్రాప్తి మొదలైన ఫలాంతరములను కలుగఁ జేయవని సూత్రార్థము. కనుక శ్రవణాదివిధి

జన్యమైన యపూర్వము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములయిన పాపములను నివారించి యేప్రకారము తత్త్వజ్ఞానమును గలుగఁజేయునో, జన్మాంతరమును గలుగఁజేయదో, యాప్రకారమే శిఖాయజ్ఞోపవీతత్యాగాదివిధిజన్యమైన యపూర్వముకూడ చిత్తవిశ్రాంతిప్రతిబంధకములను నివారించి చిత్తవిశ్రాంతిని కలుగఁజేయును గాని జన్మాంతరమును గలుగఁజేయదు.

కనుక విధిని లంఘించినప్పటికి దోషము లేకుండుట తత్త్వజ్ఞానేచ్ఛగల సన్యసింపఁగోరువారుగాని తత్త్వజ్ఞానము గలిగి సన్యసింప గోరువారుగాని నాందీముఖశ్రాద్ధము ఉపవాసము జాగరణము మొదలగు విధుల ననుసరించియే సన్యసింపవలయును.

విచారించఁగా విద్వత్సన్యాసమును విధించిన శాస్త్రమునందు నాందీముఖశ్రాద్ధాది ధర్మములను విధించి యుండలేదు. అయినా, యీ విద్వత్సన్యాసము వివిదిషాసన్యాసముయొక్క వికృతి అయినందున వివిదిషాసన్యాసములోఁ జెప్పిన యావద్ధర్మములు విద్వత్సన్యాసమునందు "ప్రకృతివద్వికృతిః కర్తవ్యా" అను న్యాయప్రకారము అతిదేశముచేత సంభవించును.

శ్రౌతకర్మలలో సర్వాంగములను ప్రతిపాదించి విధించిన కర్మలు ప్రకృతులని, కొన్ని అంగములనుమాత్రము ప్రతిపాదించి విధించిన కర్మలు వికృతు లని చెప్పఁబడును. అందులో నేకర్మ యేకర్మయొక్క వికృతిగా నుండునో ఆ ప్రకృతికర్మయొక్క ధర్మము లన్నియు వికృతికర్మలో ననుష్ఠేయములుగా ప్రాప్తించును.

హాసపురాణములును చెప్పబడుచున్నవి. లౌకికములైన పశుశాస్త్రాదులను వేదాధ్యయనమును తర్క-వ్యాకరణమీమాంసా పురాణేతిహాసములను విడువవలయు నని తాత్పర్యము.

ఔత్సుక్యనివృత్తిఫలములుగా నున్న కావ్యనాటకాదుల యొక్క త్యాగము కైముతికన్యాయసిద్ధము. అనఁగా శాస్త్రవిహితములైన వేదవ్యాకరణాదిపాఠములనే త్యజింపవలసియుండఁగా* 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని నిషేధింపఁబడిన కావ్యనాటకాదిపాఠమును త్యజింపవలయు నని చెప్పవలసినదే లేదని భావము.

'సర్వకర్మాణి' అనునదియుఁగల వాక్యశేషముచేత లౌకిక వైదికనిత్యనైమిత్తికకామ్యనిషిద్ధకర్మలన్నియును సంగ్రహింపఁబడుచున్నవి. పుత్రత్యాగముచేత నైహికభోగవాంఛయు, సర్వకర్మత్యాగముచేత ఆముష్మికభోగవాంఛయును పరిహరింపఁబడినవి. ఈ రెండు వాంఛలు చిత్తమునకు విక్షేపమును కలుగఁజేయును కనుక త్యాజ్యములుగా నున్నవి. ఈ బ్రహ్మాండమును త్యజింపవలయునని చెప్పుటచేత బ్రహ్మాండాధికారప్రాపకమైన విరాడుపాసనమును విడువవలయు నని చెప్పఁబడినది. 'బ్రహ్మాండం చ' యను చకారముచేత సూత్రాత్మప్రాప్తికారణమైన హిరణ్యగర్భోపాసనము తత్త్వజ్ఞానసాధనములైన శ్రవణాదులనుగూడ విడువవలయునని చెప్పఁబడిన ఐహికాముష్మికముల నన్నిఁటిని విడిచి కౌపీనమును దండమును కాషాయమును

*ఉద్యానక్రీడావర్ణనాదిశృంగారములైన కావ్యములను పఠింపఁగూడదని స్మృతియొక్క తాత్పర్యము.

గ్రహింపవలయును. 'ఆచ్ఛాదనంచ' అనుపదమునం దున్న చకారము పాదుకలు మొదలగున వానిఁ గొన్నింటిని గ్రహింపవచ్చునని తెలియఁజేయుచున్నది.

శ్లో. కౌపీనయుగళం వాసః కంథాం శీతనివారిణీం,
పాదుకే చాపి గృహ్ణీయాత్కుర్యాన్నాన్యస్య సంగ్రహం.

అను స్మృతి యర్థమును వివరించుచున్నది.

తా. రెండు కౌపీనములను ఒక కాషాయవస్త్రమును చలిని వారించు బొంతను పాదుకలను గ్రహింపవలయును. ఇంతకంటె నితరమైనవానిని గ్రహింపఁగూడదని స్మృతియొక్క అర్థము.

కౌపీనాదుల గ్రహించుటయును స్వశరీరోపభోగపరోపకారములకొఱకే కాని ఆత్మజ్ఞానోపకారముకొఱకుఁగాదు. కౌపీనము చేత లజ్జను, దండము చేత సర్పాద్యుపద్రవమును ఆచ్ఛాదనము చేత చలిని, ఎండను, పాదుకల చేత నుచ్ఛిష్టదేశస్పర్శమును నివారించుకొనుటయే స్వశరీరోపభోగమని దండకాషాయాదిచిహ్నములను జూచి తనయొక్క యుత్తమాశ్రమమును నిశ్చయించుకొని తనకు నమస్కారభిక్షాప్రదానాదిసత్కారములను చేసి లోకులు సుకృతమును బొందుటయే పరోపకారమనియుఁ దెలియవలయును. ఇదిగాక, అనాదిశిష్టాచారప్రాప్తమగు సన్న్యాసాశ్రమమర్యాదను పరిపాలించుటయు పరోపకారమని తెలియవలయును.

ఈవిద్వత్సన్న్యాసికిఁ గౌపీనాదిపరిగ్రహము అనుకల్పమే కాని ముఖ్యము కాదని శ్రుతి 'తచ్చ న ముఖ్యోపి' అని నిషేధించుచున్నది.

తా. కౌపీనదండాదులను పరిగ్రహింపవలయునని వెనుక చెప్పినది యీపరమహంససన్యాసికి ముఖ్యము కాదు. అముఖ్యమే యని భావము.

వివిదిషాసన్యాసికి మాత్రము దండకాషాయాదిగ్రహణము ముఖ్యము. కనుకనే వివిదిషాసన్యాసికి దండాది వియోగ మెప్పటికిని తగ దని నిషేధింపఁబడియున్నది.

శ్లో. దండాత్మనోస్తు సంయోగస్సర్వదైవ విధీయతే,
న దండేన వినా గచ్ఛే దిషుక్షేపత్రయం బుధః. ఇతి.

తా. దండమునకును శరీరమునకును సంయోగము సన్యాసికి సర్వకాలములయందు కలిగియుండవలయును. దండమును విడిచి మూఁడు బాణములు పోయెడి మార్గమునైనా నడువఁగూడదు.

'దండత్యాగే శతం చరేత్' అని దండము వదలినచో నూఱుప్రాణాయామములను ఆచరించి ప్రాయశ్చిత్తమును చేసికొన వలయునని కూడ చెప్పియున్నది. యోగ్యుడైనపరమహంస యొక్క ముఖ్యకల్పమును ప్రశ్నోత్తరములచేత శ్రుతి చూపుచున్నది.

శ్రు. కోఽయం ముఖ్య ఇతి చేదయం ముఖ్యో న దండం న శిఖా న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః. ఇతి.

తా. యోగ్యుడైన పరమహంససన్యాసికి ముఖ్యకల్ప మేది యనఁగా దండమును గాని శిఖను గాని యజ్ఞోపవీత

శీతోష్ణసుఖదుఃఖ మానావమానములు గలుగనేరవు. ఊర్మిషట్కమును కలుగనేరదు.

క్షుత్తు (ఆకలి), పిపాస (దాహము), శోకము, మోహము, జర (ముసలి), మరణము ఇవియాఱు ఊర్మిషట్కమనఁబడును. ఈయాఱింటిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జరామృత్యువులు దేహధర్మములుగనుక పరిశుద్ధాత్మస్వరూపనిష్ఠుఁడగు పరమహంససన్న్యాసికి ఈమూఁడు ద్వంద్వములు కలుగ నేరవని నిశ్చయము.

సమాధియందు శీతోష్ణ మానావమానములు లేకపోయినా, వ్యుత్థానదశయందు వివేకము లేనివానినివలె నీపరమహంసను కూడ నిందాక్లేశము బాధించు నని శంకింపఁగా శ్రుతి పరిహరించుచున్నది.

శ్రు. [illegible]

టీ. విరోధులైన పురుషులు తనయందు దోషముల నారోపించి చెప్పుట నింద. అన్యులకంటె తాను అధికుఁడని తలఁచుట గర్వము, విద్యాధనాదులచే నధికులైన వారిని జూచి తాను కూడ విద్యాధనాదులచేత వారితో సమానముగా నుండవలెననుబుద్ధి మత్సరము; ఇతరులు మెచ్చవలయునని తనయొక్క జపధ్యానాదికర్మల నితరులయెదుట నాచరించుట దంభము; ఇతరులను తర్జన భర్త్సనలచేత తిరస్కరించుట దర్పము; ధన క్షేత్రాదులయందభిలాషయే ఇచ్ఛ; శత్రువధాదులయందు బుద్ధి ద్వేషము; అనుకూలములైన ద్రవ్యగృహక్షేత్రాదులయొక్క

ప్ర. ఉక్త్యర్థాలెవి.

ఇప్పు డీపద్యమును సర్వానుకూలమైనందున సర్వవేదాంతప్రసిద్ధమయిన యీసూత్రమును చెప్పుచున్నది. ఆపరమాత్మయం దనిత్యమై అవిచ్ఛిన్నమైనజ్ఞానముగలయోగి *'తన్నిత్యబోధః' అని చెప్పఁబడుచున్నాఁడు. యోగియొక్క లక్షణము 'తమేవ ధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' అనుశ్రుతి ననుసరించి యోగాభ్యాసముచేత చిత్తవికారముల నన్నిఁటిని నివర్తింపఁ జేసికొని నిరంతరముగా పరమాత్మవిషయమయిన జ్ఞానము గలవాఁడై యుండును. కనుక జ్ఞానము నిత్యముగా నున్నందున జ్ఞానముచేతఁ జేయఁబడిన యజ్ఞానతద్వాసనానివృత్తియును నిత్యముగా నుండునని తాత్పర్యము.

ఇంతియగాక వేదాంతమతమున 'భావాంతరమభావోఽన్యో నకశ్చి దనిరూపణాత్' అనున్యాయప్రకారము ఘటముయొక్క ఉపాదానమైన మృత్పిండము ప్రాగభావమని, ఉత్తరావస్థయైనశకలములు ప్రధ్వంసాభావమని చెప్పఁబడియున్నందున, అభావమునఁగా మరియొక భావపదార్థమే కాని మరియొకటి గాదని యంగీకరించియున్నందున రజ్జువునం దారోపింపఁబడిన సర్పముయొక్క నివృత్తి రజ్జుస్వరూపముగానేయున్నందున 'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః' అనున్యా

* వేదాంతమహావాక్యశ్రవణమువలన స్వాత్మరూపమును చక్కఁగా తెలుసుకొని తదనంతరము నిదిధ్యాసనమును చేసి ప్రత్యక్షముగా తెలుసుకొనవలయునని శ్రుత్యర్థము.

'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' యనుశ్రుతి యిందుకు ప్రమాణము. ఈపరమానంద స్వరూపుఁడయిన పరమాత్మ యొక్క స్వల్పాంశమును అవలంబించి దేవతిర్యఙ్మనుష్యాదిభూతములు సుఖము ననుభవించు చున్నవి యని శ్రుత్యర్థము.

ఇట్టియభిప్రాయముతోనే యాథర్వణికులు బ్రహ్మోపనిషత్తులో చెప్పియున్నారు.

శ్రు. సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః,
యదక్షరం పరం బ్రహ్మ తత్సూత్ర మితి ధారయేత్.

తా. బ్రహ్మతత్వజ్ఞానముగల పురుషుఁడు శిఖతోఁగూడ క్షౌరమును చేసుకొని బాహ్యమయిన కనుపడుయజ్ఞోపవీతమును త్యజింపవలయును. వినాశము లేక నిత్యముగానుండు పరమాత్మనే బ్రహ్మసూత్రముగా ధరించవలయును.

శ్రు. సూచనాత్సూత్ర మిత్యాహు స్సూత్రం నామ పరం పదం,
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

తా. సమస్తార్థములను సూచించుటచేత సూత్రమని పెద్దలు చెప్పుదురు. అట్టి సమస్తార్థసూచకమయిన సూత్రము పరమాత్మ స్వరూపమేగాని మరియొకటి గాదు. అట్టిసూత్రము ను ఏబ్రాహ్మణుఁ డెఱుఁగునో అతఁడు సమస్తవేదముల యొక్క అంతమును ఎఱిఁగినవాఁడని చెప్పఁబడును.

శ్రు. యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవి త్తత్త్వదర్శివాన్.

తా. దారమందు మాణిక్యములవలె నెవనియందీ ప్రపంచము కూర్పఁబడియున్నదో యాసూత్రమునే యోగజ్ఞుఁడైనవాఁడు ధరించవలయును. అతఁడే యోగవేత్తయని, తత్త్వవేత్తయని చెప్పఁదగినవాఁడు.

శ్రు. బహిస్సూత్రం త్యజేద్విద్వాన్ యోగముత్తమమాస్థితః,
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యస్సచేతనః.
ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్.

తా. తత్త్వజ్ఞాని యగువాఁడు సర్వోత్తమమైన యోగము నాశ్రయించి బాహ్యముగా నుండు యజ్ఞోపవీతసూత్రమును త్యజించవలయును. పరమాత్మస్వరూపమైన సూత్రమును ధరించినవాఁడే చేతనుఁడు. బ్రహ్మసూత్రధారి యెప్పటికిని ఉచ్ఛిష్టదోషము గలవాఁడుగాని అపవిత్రుఁడుగాని కానేరఁడు.

శ్రు. సూత్రమంతర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినామ్,
తే వై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానమే యజ్ఞోపవీతముగాఁగల యే యోగులకు బ్రహ్మసూత్ర మంతర్గతమైయుండునో వారే ఈలోకములో సూత్రము నెఱిఁగినవారనియు, యజ్ఞోపవీతము కలవారనియు చెప్పఁబడుదురు.

శ్రు. జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః,
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే.

తా. ఎవరికి జ్ఞానమే సర్వాధికముగా నుండునో, వారు జ్ఞానమే శిఖగా కలవారుగా జ్ఞానమునందే, నిరంతరస్థితి

తా. పరమగతిప్రాపకమయిన యే బ్రహ్మాతత్త్వజ్ఞానము కలదో, అదియె యజ్ఞోపవీతము. కనుకనే బ్రహ్మజ్ఞానము గలవాఁడే యజ్ఞోపవీతము కలవాఁడని చెప్పఁబడును. ప్రాజ్ఞులగువా రతనినే సకలయజ్ఞములు చేసినవాఁ డని చెప్పుదురు.

కనుక యోగికి శిఖాయజ్ఞోపవీతములు కలవు. ఆప్రకారమే సంధ్యయు కలదు. అహంప్రత్యయముచేత తెలియఁబడు జీవాత్మను కేవలశాస్త్రముచేతనే తెలియఁబడు పరమాత్మను భ్రాంతిచేత కలిగియున్న భేదము తత్త్వమస్యాదిమహావాక్యజన్యమైన అభేదజ్ఞానముచేత తిరిగి పుట్టకుండ నశించును. ఈయభేదజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁ గలుగును గనుక సంధ్య యనఁబడును. అహోరాత్రములు రెంటియొక్క సంధియందుఁ గలుగు క్రియయే కదా సంధ్యయనఁబడునది. అహోరాత్రములయొక్క సంధియందుఁ గలిగిన క్రియ సంధ్య యని చెప్పఁబడినట్లు జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁగలిగిన అద్వైతజ్ఞానము సంధ్యయని చెప్పఁబడును. ఈప్రకారము పరమహంసను కూడ శిఖాయజ్ఞోపవీతసంధ్యలు కలిగియున్నందున యోగి యగువాఁడు కర్మజడులచేత వ్యామోహమును పొందించుటకు శక్యుఁడు కాఁడు.

ఈప్రకారము పరమహంసయొక్కమార్గస్థితులను గూర్చి చేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమును చెప్పి యిప్పుడు సమాప్తి చేయఁబడుచున్నది.

న్నదైనందున బహ్వన్నభోజనముచేత నరకమును బొందుట యుక్తముగానే యున్నది.

అనుకనే జ్ఞానహీనుఁడైన సన్న్యాసికి భిక్షానియమము మనుస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాఙ్గవిద్యయా,
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్.
ఏకకాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే.
భైక్ష్యే ప్రసక్తో హి యతి ర్విషయేష్వపి సజ్జతి.

తా. కేవలసన్న్యాసియగువాఁడు ఉత్పాతములనుగాని శకునములనుగాని జ్యోతిషములనుగాని జనులకు చెప్పి భిక్షను పొందఁగూడదు. హితోపదేశమును చేసి గాని శాస్త్రవాదములను చేసి తనపాండిత్యమును ప్రకటనచేసి గాని భిక్షను పొందఁదలఁచఁగూడదు. ప్రతిదినమును నొకసమయమునుమాత్రము భిక్షను చేయవలయునే కాని రెండుమూఁడుసమయములు చేయఁగూడదు. విస్తారముగా భిక్షయందాసక్తిగల సన్న్యాసి విషయములయందుఁ గూడ నాసక్తి కలవాఁడై చెడిపోవును.

శ్రవణాదులచేత తత్త్వజ్ఞానము నభ్యసించు సన్న్యాసికి భిక్షాక్రమము మరియొక ప్రకారముగా చెప్పఁబడియున్నది.

శ్లో. ఏకవారం ద్వివారం వా భుంజీత పరహంసకః,
యేన కేన ప్రకారేణ జ్ఞానాభ్యాసో భవేత్సదా.

తా. ఒకసమయము గాని రెండుసమయములు గాని పరమహంససన్న్యాసి భిక్షను చేయవచ్చును. తత్త్వజ్ఞా

ప్రమాతలను ప్రకాశింపఁజేయుసాక్షిచైతన్యము తత్త్వమసి యను మహావాక్యములోని త్వంపదమునకు లక్ష్యార్థమై యున్నది. దేహేంద్రియాదివిశిష్టమైన చైతన్యము త్వంపదమునకు వాచ్యమే కాని లక్ష్యము గాదు. అట్టివాచ్యము తత్పదార్థముకంటె భిన్నము. లక్ష్యము అభిన్నము. స్వదేహనిష్ఠమయిన త్వంపదవాచ్యార్థము అహం (నేను) అని చెప్పఁబడును. పరదేహనిష్ఠమైన త్వంపదవాచ్యార్థము త్వం (నీవు) అని చెప్పఁబడును. లక్ష్యమని వాచ్యమని చెప్పఁబడు ఉభయవిధచైతన్యరూపమైన జడమైన ప్రపంచము సర్వమని చెప్పఁబడును. ఇట్టి లక్ష్యాలక్ష్యవిజ్ఞానశాస్త్రవ్యవహారములలో నొకటిగూడ బ్రహ్మాయందు విశ్రాంతమైన చిత్తముగలయోగికి సంభవింపనేరదు. కనుకనే యోగి పరమహంసగృహమందు నివసించువాఁడు కాఁడు. నియతముగా నివసించుటకొరకు కొకమఠమును కల్పించుకొని యుండెనా! యామఠమందు, మమకారము గలిగి దానియొక్క హానివృద్ధులచేత చిత్తము విక్షేపము నొందుచుండును.

ఈయభిప్రాయముతోనే శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పియున్నారు.

శ్లో. నిస్తుతిర్నిర్నమస్కారో నిస్స్వధాకార ఏవ చ,
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్.

తా. పరమహంసపరివ్రాజకుఁడు స్తుతి నమస్కార స్వధాకారములు లేనివాఁడుగాను, నియతనివాసము లేనివాఁడుగాను, యాదృచ్ఛికవృత్తిగలవాఁడుగాను నుండవలయు నని భావము.

ధనము ఏప్రకారము పరిగ్రహింపదగదో, ఆప్రకారమే సువర్ణరజతకాంస్యతామ్రాదిపాత్రలను భిక్షాచమనాదులయం దుపయోగించుకొనదగదు.

ఈయర్థము స్మృతిలో చెప్పఁబడియున్నది.

శ్లో. హిరణ్మయాని పాత్రాణి కార్ష్ణాయసమయాని చ,
యతీనాం తాన్యపాత్రాణి వర్జయేత్తాని భిక్షుకః.

తా. సువర్ణపాత్రలు, ఇనుము, కంచు మొదలయిన పాత్రలు సన్న్యాసులకు భోజనపాత్రలుగా నుండఁగూడదు.

సువర్ణాదిపాత్రలను సన్న్యాసి వర్జింపవలయును అని మనుస్మృతియందు కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. అతైజసాని పాత్రాణి యతీనాం నిర్వ్రణాని చ,
తేషామద్భిః స్మృతం శౌచం చమసానామివాధ్వరే.
అలాబుదారుపాత్రం చ మృణ్మయం వైదళం తథా,
ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్.

తా. సువర్ణాదిలోహములతోఁ జేయఁబడనివియు బుడుప్రలు లేనివియు అయినపాత్రములను సన్న్యాసులు గ్రహింపవలయును. ఇట్టిపాత్రలను యాగమందు చమసము లనుసోమపాత్రలకు ఉచ్ఛిష్టసంపర్కమందు జలమువలననే శుద్ధి కలుగునటుల కేవలజలముచేతనే శుద్ధి కలుగును. కనుకనే సొరకాయ బుఱ్ఱనైనా, కొయ్యతోఁ జేయఁబడిన పాత్రమునైనా వెదురు గొట్టమునైనా సన్న్యాసి గ్రహింపవలయునని స్వాయంభువ మనువుచేఁ జెప్పఁబడినది.

బోధాయనమహర్షియు నీప్రకారముగానే చెప్పియున్నారు.

శ్లో. స్వయమాహృతపర్ణేషు స్వయంశీర్ణేషు వా పునః,
భుంజీత న వటాశ్వత్థకరంజానాం చ పర్ణకే.

తా. స్వయముగా తెచ్చుకొన్న పత్రములయందుఁగాని స్వయముగా క్రిందరాలినపత్రములయందుఁగాని సన్యాసి భోజనమును చేయవలసినది. మఱ్ఱియాకులయందుఁగాని, రావియాకులయందుఁగాని, కానుగాకులయందుఁగాని భోజనము చేయఁగూడదు.

శ్లో. ఆపద్యపి న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః,
సౌవర్ణే రాజతే తామ్రే మృణ్మయే త్రపుసీసయోః.

ఆపత్కాలమందైనా ఈసన్యాసి కంచు బంగారు వెండి రాగి మృత్తు సత్తు సీసము ఈపాత్రలయందు భోజనము చేయఁగూడదు. చేసెనో మలమును భక్షించినవాఁడగును.

ఈప్రకారమే లోకమును (శిష్యవర్గమును) పరిగ్రహించఁగూడదు.

ఇది మనువుచేఁ జెప్పఁబడినది.

శ్లో. ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థ మసహాయకః,
సిద్ధిమేకస్య సంపశ్య న్న జహాతి న హీయతే.

తా. సన్యాసి యొంటరిగా నుండి తత్త్వజ్ఞానసిద్ధికొఱకు అసహాయముగా సంచరించవలయును. ఏకాకిగా నుండువానికి జ్ఞానసిద్ధి కలుగుటను చూచి ఇతరసహాయమును విడుచును. ఆప్రకార మితరసంగమును విడిచినందున హాని లేదు.

ఈ విషయము మేధాతిథి యను మహర్షి యును చెప్పి యున్నారు.

శ్లో. ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః,
దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్.

తా. ఆసనము, పాత్రలోభము, సంచయము, శిష్యసంగ్రహము, దివాస్వాపము, వృథాలాపము అను నీయారును సన్న్యాసికి బంధకములు.

ఈ చెప్పిన యారుదోషములయొక్క స్వభావము ఆ ఋషిచేతనే వివరింపఁబడినది.

శ్లో. ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే,
వర్షాభ్యోఽన్యత్ర యత్స్థాన మాసనం తదుదాహృతమ్.

తా. గ్రామములో నొకదినముకంటె పట్టణములో నైదుదినములకంటె నధిక కాలము నిలువకను వర్షాకాలము నాలుగు మాసములలోతప్ప నితరకాలములయం దొకచోట విశేషకాలము నిలుచుటయును ఆసనమనఁబడును.

శ్లో. ఉక్తాలాబ్వాదిపాత్రాణా మేకస్యాపి న సంగ్రహః,
భిక్షోర్భైక్షభుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే.

తా. సన్న్యాసి యగువాఁడు భిక్షాన్నమును భుజించుచున్నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొకదానినైనా గ్రహింపకపోవుట పాత్రలోభమని చెప్పఁబడును.

శ్లో. గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః,
కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః.

తా. దండకాషాయాదులను పరిగ్రహించి అవి భిన్నమైన తరువాత తిరిగి ధరించుటకుగాను రెండుమూఁడుదండములను కాషాయములను సంపాదించి పెట్టుకొనుట సంచయ మనఁబడును.

శ్లో. శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః,
శిష్యాణాం న తు కారుణ్యా త్స జ్ఞేయశ్శిష్యసంగ్రహః.

తా. శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటిని అపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనఁబడును. కేవల దయచేత శిష్యులను కృతార్థులను చేయవలయు ననెడి యిచ్ఛచేత చేర్చుకొనుట శిష్యసంగ్రహ మని చెప్పఁబడదు.

శ్లో. విద్యా దివా ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే,
విద్యాభ్యాసే ప్రమాదో యస్స దివాస్వాప ఉచ్యతే.

తా. బ్రహ్మజ్ఞానము ప్రకాశస్వరూపమైనందున దివా (పగలు) అనిచెప్పఁబడును. అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనఁబడును. జ్ఞానమనెడి పగటియందు ప్రమాదము గలిగియుండుటయె దివాస్వాప మనఁబడును.

శ్లో. ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్ష్యచర్యాం గురుస్తుతిం,
అనుగ్రహం ప్రశ్నే వృథాలాప స్స ఉచ్యతే.

తా. అధ్యాత్మవిషయమైన కథలను దేహధారణార్థమైన భిక్షాచరణమునందు 'భిక్షాం దేహి' యను శబ్దోచ్చారణమును పరమేశ్వరస్తవమును వీటిని మాత్రము సన్న్యాసి చేయవలయును. వీటికంటె నితరములైన దారిసమాచారములను అనుగ్రహముచేతనడిగినా, అదివృథాలాపమని చెప్పఁబడును. శిష్య

జనరూపమైన లోకమును పరిగ్రహింపఁదగదని చెప్పినందున శిష్యజనమును పరిగ్రహింపక యుండుటమాత్రమే కాదు. అట్టివారి యవలోకనమునుగూడఁ జేయఁగూడదని తెలియవలయును. ఈశిష్యులు ఖ్యాతిలాభపూజాసంపాదనద్వారమైనందున బంధహేతువులే గాని తత్త్వజ్ఞానానుకూలవృత్తి కలవారు కారు. అంతమునందుండు చకారముచేత మఱికొన్ని శ్రుతినిషిద్ధములను గూడ నాచరింపఁదగదని సూచింపఁబడుచున్నది.

వానిని మేధాతిథియే కనుపఱచియున్నారు.

శ్లో. స్థావరం జంగమం బీజం తైజసం విషమాయుధం,
షడేతాని న గృహ్ణీయాద్యతిర్మూత్రపురీషవత్.

టీ. గృహక్షేత్రాదిస్థావరములను, శిష్యాదిజంగమములను, యవగోధూమాదిధాన్యములను, కాంస్యాదిలోహములను విషమును అనఁగా ఔషధములను ఖడ్గాద్యాయుధములను వీనినారింటిని మూత్రపురీషములవలె సన్న్యాసి సంపాదించి పరిగ్రహింపఁగూడదు.

శ్లో. రసాయనం క్రియావాదం జ్యోతిషం క్రయవిక్రయం,
వివిధాని చ శిల్పాని వర్జయేత్పరదారవత్.

టీ. రసాయనాదివ్యౌషధప్రయోగమును సువర్ణరజతాదినిర్మాణకౌశలమును భూతభవిష్యద్వర్తమానములను చెప్పు జ్యోతిషశాస్త్రమును క్రయవిక్రయాదివ్యవహారములను పలువిధములగు శిల్పములను వీనిని పరస్త్రీని త్యజించినట్లు త్యజించవలయును.

వా. ఇంతవఱకు యోగియైనపరమహంసకు వైదికలౌకిక వ్యాపారములయందుండు బాధకములను గనుపఱచి వాటిని విడువవలయు నని చెప్పఁబడినది.

అ.—ఇకముందు సర్వప్రకారములచేత బాధకములైనవాటిని ప్రశ్నోత్తరములచేతఁ జూపించి వాటిని విడువవలయు నని యీశ్రుతి చెప్పుచున్నది.

శ్రు. అథ బాధకం కిమితి చేత్, అబాధకోఽస్త్యస్య. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన దృష్టం చేత్స బ్రహ్మహా భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్స పౌల్కసో భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన గ్రాహ్యం చేత్స ఆత్మహా భవేత్. తస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన న దృష్టం న స్పృష్టం న గ్రాహ్యం చేతి.

తా. యోగియైన పరమహంససన్యాసికి మిక్కిలి బాధకమైనది యేదిగా నుండు ననఁగా మిక్కిలిబాధకమైనది యొకటి కలదు. అది సువర్ణము. సువర్ణమును ఆసక్తితో సన్యాసిచూచెనా! బ్రహ్మహత్య కలవాఁ డగును. సువర్ణమందుండు నాసక్తిచేత దానిని సంపాదించుటయందు, రక్షించుటయందు నెప్పటికి ప్రయత్నమును చేయుచు, అసంపాదనరక్షా ప్రయత్నములయొక్క వ్యర్థత్వశంకను పరిహరించుకొఱకు ప్రపంచమిథ్యాత్వబోధకములైన వేదాంతవాక్యములను దూషించి, ప్రపంచసత్యత్వమును ప్రతిపాదింపుచుండును. అందుచేత శాస్త్రసిద్ధమైన అద్వితీయబ్రహ్మస్వరూపము ఆసన్యాసిచేత నశింపఁజేయఁబడును గనుక నాసన్యాసి బ్రహ్మహత్య చేసినవాఁడనే చెప్పఁదగును.

ఈయర్థ మొకస్మృతిలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాత్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః,
అభూతబ్రహ్మవాదీ చ త్రయస్తే బ్రహ్మఘాతకాః,
బ్రహ్మఘ్నాః స తు విజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతాః.

తా. పరబ్రహ్మ లేఁడని యెవఁడు చెప్పునో, బ్రహ్మవేత్తతో నెవఁడు విరోధించునో, బ్రహ్మస్వరూపము శాస్త్రములోఁ జెప్పినప్రకారముగా కాకుండ మఱియొకవిధముగా నెవఁడు నిరూపించునో, వీరు మువ్వురు బ్రహ్మఘాతుకులని చెప్పఁబడుదురు. ఈబ్రహ్మఘాతుకుఁడు సర్వధర్మములనుండి బహిష్కృతుఁడై యీలోకములో నిందింపఁబడుచు పరలోకమున నరకయోగ్యుఁడై పడిపోవును. అభిలాషపూర్వకముగా సువర్ణమును స్పృశించినయెడల సన్న్యాసి పతితుఁడై మ్లేచ్ఛసమానుఁడై పోవును.

ఈయర్థము స్మరింపఁబడుచున్నది.

శ్లో. యత్యాసౌ క్రమం విత్యుర్ధ్వస్య భిక్షోర్న్యాయం నృణాం,
ధీపూర్వం రేతఉత్సర్గః ద్రవ్యసంగ్రహణం తథా.

తా. ఏసన్న్యాసి బుద్ధిపూర్వకముగా రేతస్సును విడుచునో, సువర్ణమును సంగ్రహించునో, ఆసన్న్యాసి నిశ్చయముగా పతితుఁడౌను.

ఆసక్తిపూర్వకముగా సువర్ణమును గ్రహింపఁగూడదు. గ్రహించెనో, అట్టియాసన్న్యాసి దేహేంద్రియాదిసాక్షియై యసంగుఁడైనచిదాత్మను వంచించిన వాఁడగును. ఆత్మయొక్క అసంగత్వమును మఱచి సువర్ణాదిద్రవ్యమునుగూర్చి ఆత్మ భోక్త

యంగీకరించినందున ఆత్మహత్య చేసినవాఁ డని చెప్పఁబడు ను. ఇట్టి అన్యథాప్రతిపత్తి సర్వపాపస్వరూప మని మహా భారతములో శకుంతలాదుష్యంతసంవాదములోఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. అన్యథాసంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా.

తా. ఒకప్రకారముగా నున్న యాత్మస్వరూపమును మరియొకప్రకారముగా నెవ్వఁడు తలఁచునో, అట్టి ఆత్మాపహారము చేసిన చోరుఁడు ఏపాపమును జేయనివాఁడుగా నుండును? అనఁగా సర్వపాపములను జేసినవాఁడే యని యర్థము.

అదిగాక యాత్మహత్య చేసినవానికి సుఖలేశము కూడ లేక నానావిధదుఃఖపూర్ణము లైన లోకములు ప్రాప్యములుగా నుండు నని యొకశ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

శ్రు. అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః,
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కేచాత్మహనో జనాః.

తా. ఆత్మ నన్యథాప్రతిపత్తిచే నశింపఁజేసిన పురుషులు గాఢాంధకారముచే నావరింపఁబడిన అసుర్యములను పేరుగల పాపలోకములను పొందుదురు. దృష్టస్పృష్టగ్రాహ్యాశబ్దములతో క్రమముగా సంబంధించిన చకారత్రయమునకు శ్రుతకథితవ్యవహృతము లర్థము. సువర్ణముయొక్క దర్శనస్పర్శనగ్రహణములు సన్యాసికి ప్రత్యవాయకరము లైనటులసాభిలాషముగా సువర్ణముయొక్క వృత్తాంతమును వినుటయును

దాని గుణములను కీర్తించుటయును సువర్ణమును క్రయవిక్రయాదులచేత వ్యవహరించుటయును ప్రత్యవాయకరములని తాత్పర్యము. సన్యాసికి సువర్ణస్పర్శనాదులు దోషసంపాదకములు గనుక వానిని సన్యాసి ప్రయత్నపూర్వకముగా పరిహరించవలయు నని సముదాయతాత్పర్యము.

సువర్ణమును త్యజించినందువలన విశేషఫలమును చెప్పుచున్నది.

శ్రు. సర్వే కామా మనోగతా వ్యావర్తంతే; దుఃఖే నోద్విగ్నస్సుఖే నిస్పృహస్త్యాగే రాగే సర్వత్ర శుభాశుభయోరనభిస్నేహో న ద్వేష్టి న మోదతే చ సర్వేషామింద్రియాణాం గతిరుపరమతే య ఆత్మన్యేవావస్థీయతే.

తా. పుత్రభార్యాగృహక్షేత్రాదికామము లన్నియు సువర్ణమూలములు గనుక సువర్ణమును పరిత్యజించగా మనోగతములైన యీ కామములన్నియు పరిత్యజించబడును. కామములను పరిత్యజించగా కామముచేత ప్రాప్తించు సుఖమునం దభిలాషయును దుఃఖమునం దుద్వేగమును గలుగనేరదు. సుఖదుఃఖములయం దభిలాషోద్వేగములు సంభవించనేరవను నర్థము స్థితప్రజ్ఞలక్షణమును చెప్పునప్పుడు విస్తారముగా నుపపాదించి యున్నారము. ఐహికసుఖదుఃఖములను విడువగా నాముష్మికసుఖమునందు రాగమును విడువబడును. ఐహికసుఖాభిలాషగల పురుషుడే యాముష్మికసుఖమును కోరుచుం

డును. కనుక నైహికమందు నిస్పృహగలవాఁడు ఆముష్మిక సుఖములయందును నిస్పృహగలవాఁడై యుండు నని చెప్పుట యుక్తముగానే యున్నది. ఇందువలన నిహలోక పరలోకములయం దుండు శుభాశుభవిషయములయందు స్నేహము లేనివాఁడై యుండును. ద్వేషముకూడ లేకనే యుండును. ఇటువంటి మహాపురుషుఁడు తనయందు ప్రతికూలముగా ప్రవర్తించువానివిషయమై ద్వేషమునుగాని అనుకూలముగా ప్రవర్తించువానివిషయమై మోదమును గాని పొందఁడు. ద్వేషమోదములు లేనివాఁడై యేపురుషుఁడు పరమాత్మయందే నిరంతరనిష్ఠగలవాఁడై యుండునో ఆపురుషునకు సర్వేంద్రియములు ప్రవృత్తిశూన్యములై యేకాగ్రతనొంది యుండును. ఇంద్రియము లేకాగ్రత నొందుటవలన నిర్వికల్ప సమాధికి విఘ్న మెప్పుడు కలుగనేరదు.

ఇఁకను శ్రుతి విద్వత్సన్న్యాసము నిగమించుచున్నది.

శ్రు. యదా పూర్ణానందైకబోధ స్తద్బ్రహ్మాహమస్మీతి కృతకృత్యో భవతి.

తా. ఏ పరబ్రహ్మ వేదాంతములయందు పూర్ణానందజ్ఞాన స్వరూపుఁడని, పరమాత్మయని ప్రతిపాదింపఁబడియున్నదో, ఆబ్రహ్మను నేనే యని సర్వదా అనుభవించుచుండు యోగి యైన యీపరమహంససన్న్యాసి కృతకృత్యుఁడై యుండెను.

ఈయర్థము స్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

# సంస్కృతగ్రంథములు.

## పురాణగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, టీక | ... | 0 | 2 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు, 15 వాల్యుములు | ... | 70 | 0 |
| శ్రీమద్రామాయణము, చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, మేలుప్రతి, 2 వాల్యుములు | ... | 6 | 0 |
| ,, సుందరకాండము, మూలము | ... | 1 | 0 |
| ,, ఉత్తరకాండము, మేలుప్రతి | ... | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహి, ఆంధ్రతాత్పర్యసహితము 7 వాల్యుములు | ... | 17 | 0 |
| బాలకాండ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| అయోధ్యాకాండము ,, | ... | 3 | 0 |
| అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| సుందరకాండము ,, | ... | 2 | 0 |
| యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| ఉత్తరకాండము ,, | ... | 2 | 8 |

